శ్రీ

# పతివ్రతాశతకము.

ప్రధాన రాజపోషకులు.

మహారాజరాజశ్రీ

శ్రీ శ్రీ శ్రీ

రాణీ భూదేవమ్మరావుగారు,

మిర్జాపురం ఎస్టేటు,

నూజవీడు,

కృష్ణాజిల్లా.




# పతివ్రతాశతకము.

## కవిత్రయభారతము.

### ఆదిపర్వము—చతుర్థాశ్వాసము.

—కణ్వమహర్షి శకుంతలతో చెప్పిన పద్యము.—

ఆ. ఎట్టిసాధ్వులకును బుట్టినయిండ్లను
బెద్దకాలమునికి తద్దతగదు
పతులకడనునికి సతులకు ధర్మువు
సతులకేడుగడయుఁ బతులచూవె. 1

### ఆరణ్యపర్వము—పంచమాశ్వాసము.

మార్కండేయుఁడు ధర్మజునకుఁ బతివ్రతా
—మాహాత్మ్యంబు సెప్పుట.—

ఉ. ఆయెలనాఁగ భర్త గడునాఁకటఁ దూలుచువచ్చె వచ్చి సం
దోయజనేత్ర సంభ్రమముతోఁ దగుపీఠము వెట్టి పాద్యముం
బాయక మజ్జనక్రియయు భక్తినొనర్చి ప్రియోక్తులొప్పఁగా
నాయనఁ బ్రీతుఁ జేసె రుచిరాన్నరసంబులనింతి చెచ్చెరన్. 2

గీ. పతియచూవె నాపాలికిఁ బరమదైవ
మేను వాఙ్మనఃక్రియలఁ దద్ధితమయెప్పుడుఁ
గోరి యొనరింతు దీని మిగులఁగనొంచు
ధర్మవులుగాన నెందును దలఁచిచూచి. 3

—•ద్రౌపది సత్యభామకుఁ బతివ్రతాధర్మంబులుసెప్పుట.•—

చ. అలయక మంత్రతంత్ర వివిధౌషధభంగులఁజేసియెంతయుఁ
వలతురునాథులంటమగు వాకము బేలతనంబు దానముఁ
గలిగిన ప్రేమయుంబొలియు గానియొకంచును సిద్ధిఁబొందద
ప్పాలఁతుకతోడిమన్కి యహిపొత్తుగఁజూచువిభుండెటింగినఁ. 4

చ. మగువయొనర్చువశ్యవిధి మందులుమాకులునొంచుచందమై
మగనికిఁదెచ్చురోగములు మానకమూకజడాదిభావముల్
మొగినొనరించు నద్భుతముల్ దనచేసినచేతలై తుదిఁ
జగమునకెక్కునిందయును సద్గతిహానియువచ్చు నింతికిఁ. 5

క. కావునఁ బతులకుసెప్పుడుఁ
గావింపందగదు కపటకర్మంబులు ద
ద్భావమెఱిఁగి యనువర్తిస్
మై వనితచరింప సదియయగు నెల్లవియుఁ. 6

సీ. పతులాత్మనొండొక్క పడఁతులఁగలసిన
నలుగనెయ్యెడల నహంకరింప
మదముఁ బ్రమాదంబుమాని వారికిఁజిత్త
మేకముఖంబుగ నెల్లపొద్దు

భక్తిసేయుదుఁ బ్రాపుఁ బలుకును గోర్కెయు
స్నేహంబు వింతగాఁ జేయనెపుడు
సమరగంధర్వ యక్షాదులందైనను
బురుషు నన్యునిఁ దృణంబుగఁ దలంతు

గీ. స్నాన భోజనశయనాది సంప్రయోగ
మర్థిఁ బతులకు మున్నెందు నాచరింపఁ
బతులువచ్చిన నాసనపాద్య విధుల
భక్తితోనేనకావింతుఁ బనుపనౌరుల. 7

చ. తగియెడువేళలందు నియతంబుగ మజ్జనభోజనక్రియల్
దగనొడఁగూర్తు భర్తలకు ధాన్యధనంబులురిత్తమై వ్యయం
బగుటకునోర్వనెప్పుడు గృహస్థలభాండవిశోధనంబు లి
మ్ముగనొకనాఁడునేమఱఁ బ్రమోదముసల్పుదుబంధుకోటికిన్. 8

క. పలుమాఱుందలవాకిట
మెలఁగుటయసతీజనైక నిత్యతకలహం
బుల కెలయుటసగు పలుకులఁ
బెలుచసగుటనాకుఁగాని పెంపిడుగువా. 9

క. పతులిచ్ఛమెయిఁ బ్రవాస
స్థితులైనం బుష్పగంధవస్త్రాభరణ
ప్రతతిధరియింపఁ దద్గత
మతినగుచుఁ దదాగమంబ మదిఁగాంక్షింతున్. 10

ఉ. అత్తకుభక్తిఁగల్గి మదినాయమసెప్పినమాడ్కి జీవికా
వృత్తములావహింతు గురువిప్రజనాతిథిపూజనంబు ల
త్యుత్తమభక్తినేనె తగనోపియొనర్తుఁ బ్రియంబుఁ దాల్మియున్
మెత్తఁదనంబుసన్మతియు మేలుగఁదాల్తు సమస్తభంగులన్.

క. పతిమనసు నాఁచికొనియెడు
చతురోపాయంబునీకుఁ జపలాక్షిసువి
శ్రుతమతిఁ జెప్పెద వినుమా
[illegible]తమును ధర్మాన్వితము సుశీలంబునుగాన్. 12

చ. పతిఁగడవంగదైవతము భామలకెందునులేదు ప్రీతుఁడై
పతికరుణించెనేనిఁ గలభాషిణిభాసుర భూషణాంబరా
న్విత ధనధాన్యగౌరవము విశ్రుతసంతతియున్ యశంబు స
ద్గతియునుగల్గునొండుమెయిఁగల్గునెయిన్ని తెఱంగులారయన్ 13

ఆ. కరము దుఃఖపడినఁగాని యొక్కింత సౌ
ఖ్యంబు ధర్మగతియుఁ గలుగదెందుఁ
జూడుమబల భర్తృశుశ్రూషఫలము సం
తత శుభంబుగలదు ధర్మవాదవు. 14

క. కావున నిత్యము సమ్య
గ్భావము ప్రేమంబువెరవు భక్తియుఁబ్రియముం
గావింపుము నీప్రియునెడ
భావముఁదానెఱిఁగి భర్త బాగుగమరగున్. 15

మ. వసుజాక్షుంపుగడంగి నీదగు గృహద్వారంబు సేరంగ వ
చ్చినసంగావిని లెమ్ము సంభ్రమముతోఁ జెన్నొందుసభ్యంతరం
బునకుఁ వచ్చిన నాసనాదికరణంబుల్ దీర్చి దత్రజ్జనం
బు నియోగించితిసంచుసుండక ప్రియంబుల్ సేయుమీ వృందగుఁ

చ. తివిరిముకారిసీకుఁ గసుఁదీపుగఁ జెప్పిన పల్కుగల్గిసం
గువలయనేత్రనీమనసు గూడిసవారికినై సనెప్పుఁ జె
ప్పవలదు దానఁ నొందొక నెపంబుపతంతు రెత్తంగిఁ గేసి సీ
సవతులు కృష్ణబుద్ధివిరసంబగు నీదెసఁదప్ప్రయుక్తిచేఁ. 17

చ. పతికినసుంగులైన తగుబంధులమిత్రుల భోజనాది స
త్కృతముల నాదరించుచు సత్క్రియ భక్తిని యుక్తిసంతతో
త్థితమతివై చరింపుము తదీయహితేతరవృత్తులైన వా
రతిన భవత్సుహృజ్జనములైనను గైకొనకుంపు మెప్పుడుఁ. 18

క. విను ప్రద్యుమ్నాది భవ
త్తనయుల నెడనైన నేకతంబున నేకా
సనమున నుండుట దూష్యం
బని యెఱుఁగుము సతులచరిత లతిదుష్కరముల్. 19

క. కులవతులును సతులును ని
ర్మలమతులును నైనయట్టి మగువలతోడం
జెలిమి యొనరించునది దు
ర్వలసితవనితాభియుక్తి విడువుము తరుణీ! 20

## అనుశాసనికపర్వము—పంచమాశ్వాసము.

### -♦ పార్వతి శివునకుఁ బతివ్రతాధర్మంబుల తెఱఁగెఱిగించుట. ♦-

సీ. ఋతుమతిగాక శుద్ధతయుఁ గల్గినయింతి
కన్య దత్పరిణయ కరణమునకు
నొడయులువిను తల్లియును దండ్రియును దండ్రి
తోఁబుట్టి నతఁడు మాతులుఁడు సోద
రుండును యోగ్యవరునిఁ జూచివారిలో
నెవ్వరైనను బ్రీతి నిచ్చువారు
పతియంతనుండియుఁ బ్రభువు దానికినట్లు
గావున నాతండ దైవమనుచు

గీ. వతనినుతమూఁది దేవతాపితృసమర్చ
నములు నతిథిపూజనము సన్మతిసమాచ
రించుచును బతిహితము వాటించినడపు
సతిపతివ్రత యిహపర సౌఖ్యమహిత. 21

క. లలనయిలువాడి నాథుఁడు
వలచిన చవివంటకములు వండియిడి తనుం
గలయఁ దలంచిన మెయికొని
తొలమిం గై సేసిహృదయ మీవలయుశివా. 22

తే. పనులయెడ మాఱుపలుకక యనవధానుఁ
డైన పతిఁదలఁపించి ధర్మార్థకలిత
కృతులు నడపుచు సవతిగల్గినను బోరి
తంబులేకొక్కటైయున్కి దగవు సతికి. 23

క. సవతాలికిఁ బతివలచిన
నవ్వఁగాకని యతని యిచ్ఛకనురూపముగాఁ
దివిరినడచు సతి దైవము
శివయది దగునెల్ల జనముచేమ్రొక్కుఁగొనన్. 24

క. తనచేతికినిచ్చిన వ
స్తునికాయము నిల్లురువున చొప్పనమగుడం
గొనవచ్చి భార్యపతి డె
మ్మనినప్పుడ యిచ్చుటొప్పున కపటవృత్తిన్. 25

క. పతిదనకునేమియిచ్చిన
నతిముదమునఁ బొందవలయు నాత్మజుఁడైనన్
పతిఁగొంకక యేకాంత
స్థితినేకాసనతనున్కి సెట్ట ప్రమదకున్. 26

క. ధని యధనుఁడు రూపసి యొ
ప్పనివాఁడవివేకి మూఢభావుఁడ రోగుం
డనుగత రోగుఁడనక యం
గనపతిఁ బాటింపవలయుఁ గామధ్వంసీ. 27

క. బలిభిక్షము గడపకిడ
న్వెలయును దేవపితృ పూజనంబుల కాలం
బులఁ బతిశుభ మందుటఁ ద
త్ఫలఁబుగాఁగోరు టొప్పిదముసతికిశివా. 28

క. గతిపతియచు వ్వె భార్యకు
సతనిఁగడచినట్టి సత్పరాయణము గృహ
యుతకలదే కావునఁ దా
నతనికి భక్తియగుటిచ్చు నఖిలశుభంబుల్. 29

పార్వతి శివునకుఁ బతివ్రతకనర్హంబులగు ధర్మంబులఁ దెలుపుట.

సీ. పరమేశయాసురి పైశాచి రాక్షసి
యనుపేళ్ళగలన ధర్మాంగనలకు
వ్యభిచార తత్పరత్వంబువారికెల్ల
గలదసురాంశజ క్రౌర్యనిరత
దనయిచ్చఁబాలియించు ధనధాన్యములు చల
హృదయభోగపరాత్మ యీర్ష్యగలదు
పైశాచిక్రోధన భర్తృపుత్రులయందు
నిస్నేహ గృహకార్య నిపుణగాదు

గీ. కలహశీల రాక్షసి సుఖకంబులేదు
బొంకువల్కు నెప్పుడు నిద్రపోవువీత
లజ్జయుండదు నాథుకులంబువారి
దురితమొందించిపోవరు నరకమునకు. 30

ఆ. ఎఱుకఁగలిగి పిడపనేనియుఁ బతిభక్తి
గలిగి ధర్మమోపి చలిపి శాంతి
గలిగియున్న మున్నుగల పాపములువాసి
పురుషుతోడ దివికి బోవఁగంద్రు. 31

ఆ. అట్లుగాక పతులయంతియ సమయంబు
నంమఁ జింతెఁదక్కయను మరణము
సేసిరేని సుగతిసిద్ధించుఁ బతిసమే
తంబుగాఁగ నన్నితంబినులకు. 32

క. ద్విజభామినికి సధర్మము
ప్రజఁగాంచినపిదప నయ్యపత్యము కోకో
ద్విజతయుఁ బతిభక్తియునై
త్యజించియను మరణనియతియగుట మహేశా. 33

తే. భర్తచేతనియోగింపఁ బడక సతికి
నెద్దియునుజేయగాదగ దెద్దిమైన
భర్తచేత నియోగింపఁబడినదాని
జేయకునికి దోషంబనిచెప్పె మనువు. 34



## రుక్మాంగద చరిత్రము.

### ప్రౌఢకవి, మల్లనార్యప్రణీతము.

సంధ్యావళి మోహినీకాంతకు పతివ్రతా ధర్మములు చెప్పుట.

చతుర్థాశ్వాసము.

క. పతిభక్తితోడఁ జరిపెడు
వ్రతములు వలదనెడునట్టి వనితలుగలరే!
పతిమాట కడుగుదప్పక
సతులకు ననుకూలబుద్ధిఁ జరియింపఁదగున్. 35

సీ. తలఁపులో నాత్మేశు దైవంబుమాఱుగా
దరలాక్షి యనురక్తిఁ దలఁపవలయు
విభుఁడు సెప్పినమాట వేదమంత్రంబుగా
నెలఁత నెమ్మనమున నిలుపవలయు
నధిపతినియమించినది నిజవ్రతముగా
జలరుహాయతనేత్ర సలుపవలయుఁ
జెలువుఁడాదరణనిచ్చిన పదార్థము పని
వేలుగా నాత్మ భావింపవలయు
గీ. వలయుఁబ్రియమునఁ బెనిమిటివంకవారిఁ
బ్రాణబంధులుగాఁజూడ భామినులకు
వలవ దధిపతి పగవారివలన మైత్రి
సేయ నెన్నండుజూడ రాజీవముఖికి. 36

సీ. అభ్యంగనముసేసి యాత్మేశు నుష్ణోద
కములఁ దీర్థంబార్పఁగానువలయుఁ
బతిచిత్తమెఱిఁగి యేర్పడఁ గూడుఁగూరలు
వేళతోఁ జుతిన కావింపవలయు
వివిధపక్వాన్నముల్ వేడ్కఁగ వండించి
ప్రియునకు భుజియింపఁ బెట్టవలయుఁ
దద్భుక్తశేషమై తనరు నుచ్ఛిష్టాన్న
మింపుతోఁ దత నారగింపవలయు

గీ. శయ్యవిదలించి పైచీరె చక్కఁబరచి
పురుషుఁ బవళింపఁజేసి తాంబూలమొసఁగి
యూరువులనుంచి పాదంబులొత్తిమెత్తి
పిదప నిద్రింపఁదగు జంద్రబింబముఖికి. 37

సీ. మందిమేలములైన మాటలాడఁగరాదు
యెదురుమంచముపూన్కి నెక్కరాదు
ముదలవెట్టక వీసముసువ్యయింపఁగరాదు
కోపించెననిమదిఁ గుందరాదు
సొమ్ముపెట్టఁడటంచు సొలసిపల్కఁగరాదు
చెలువుఁగైకొనికాని కలయరాదు
సంభోగమునగాని చనవుసూపఁగరాదు
కులటతో సంసర్గఁ గూడరాదు

గీ. తెల్లవారినపిదప నిద్రింపరాదు
కుడువరాదధిపతికిముం గూడగూర
యన్య పురుషులతో హాస్యమాడరాదు
మఱపుతో నైన యొకనాడు మానినులకు. 38

చ. వ్రతములుసల్పవల్వ దుపవాసములంగృశియింపవల్దు సం
తతమును దీర్థసేవలకుఁ దాజనవల్వదు దేవతార్చనల్
ప్రతిభనొనర్పఁగావలదు పంకరుహాయత చారునేత్రికిం
పతినిజభక్తిఁదావిడిచి పామరయై నరకంబునం బడుం. 39

గీ. కనకశైలంబు తలయంపిగా శయించి
చిదిపి దాలేరఁబోయిన చెవులుగాదె
యిహపరములిచ్చు పతిభక్తి నెడలియతివ
యెందువిధమున మోక్షంబునొందఁజనుట. 40

క. పతిలేమినొందినప్పుడు
నతిశయరోగములడస్సి నప్పుడును జరా
న్వితుఁడైనయపుడు బాయక
సతికింబతిసేవ భక్తిఁ జలుపఁగవలయుం. 41

సీ. పుష్పగంధికిఁగల్ప భూజంబుపతిభక్తి
సుదతికిఁ బ్రియుపూజ శోభనంబు
ధవళలోచనకుఁ జింతామణి పతిభక్తి
యింతికిఁ బతిసేవ యిష్టసిద్ధి

సితపద్మముఖికి సంజీవని పతిభక్తి
సతికి నాథునికూర్మి జన్మఫలము
మానినీమణికి నిదానంబు పతిభక్తి
భార్యకుఁ పతిదయ పసిఁడిమూట
గీ. కావున మృగాక్షి పతిభక్తి కలిమిఁజేసి
యమర గంధర్వ సిద్ధ విద్యాధరోర
గాంబుజాస్యలకంటె నత్యంతమహిమ
నూర్జితైశ్వర్య శుభముల నొందునెపుడు. 42

చ. పెనిమిటియన్యకామినులఁ బ్రీతిపరించిన నాత్మలోపలన్
గినుకవహింపరాదు సతికిన్ బతికిన్ బ్రియమైనయట్లుగా
వనితచరింపఁగావలయు వల్లభుఁడల్క వహించియుండినన్
దనపతిశయ్యచేరు పనుదాఁదగుభూస్థలిఁబవ్వళింపఁగన్. 43

మ. పరదేశంబువిభుండుచన్నపిదపన్ బ్రాణేశురాకన్ నిరం
తరమున్ గోరుచు మేనువాసి చెవులన్ గ్రాకులున్ జేతులం
సారదింగాజులు నల్లపూసలరుతన్ జూపట్టుచుండంగ సుం
దరియక్షింతలబొట్టునుంబసవుమోదంబొప్పఁదాల్పందగున్.

సీ. కామినీమణికి మంగళసూత్రమే చాలు
శృంగారములకెల్లఁ జెలువొనర్ప
ధవళలోచనకు నైదువతనంబే చాలు
వైభవంబునకెల్ల వన్నెవెట్ట

సంబుజాననకుఁ బుణ్యస్త్రీతన మెచాలు
రాజసంబులకెల్లఁ దేజమొసఁగ
సతికినాథుఁడు దృఢస్థితినుండుటయెచాలు
భాగ్యలక్ష్ములకెల్లఁ బ్రభయొసర్ప

గీ. నెన్నిజన్మంబులందుఁ బద్మేక్షణలకుఁ
బతిహితంబునకంటె శోభనముగలదె
ఇహపరములిచ్చు హృదయేశు మహిమదెలియ
కధిపుతో వాదులుడువఁగా నస్థ్మమగునె. 45

క. ధవుఁడుగలయన్నిదినములు
ధవళాక్షికి భోగభాగ్య ధర్మవులొనరుఁ
ధవుఁడెడలినపిమ్మట సతి
శవమేటికి దానిరూప సంపదగరిమల్. 46

మత్తకోకిల.
కావునన్ దరళాయతాక్షి మగండదైవము నాథునిన్
గావరంబున ధిక్కరించినఁ గల్మషంబుననొందురా
జీవలోచన వాదులాడకచేయనిమ్ము వ్రతమ్ము ధా
త్రీవరుం బ్రముదంబెలర్ప మదింజలంబుత్యజింపుమా. 47



## కా శీ ఖ ం డ ము.

## శ్రీనాథప్రణీతము.

## ద్వితీయాశ్వాసము.

—♦బృహస్పతి లోపాముద్రకు బతివ్రతాధర్మములు చెప్పుట.♦—

సీ. ప్రాణేశుఁడారగింపక భుజింపవు భర్త
నిద్రింపకయమున్న నిద్రవోవు
నాథుండు మేలుకొనకమున్న మేల్కాంతు
కైసేయకెన్నఁడు గవయవధిపు
ధవుఁడు ప్రోషితుఁడైనతఱి వాడియుండుదు
పతికినెప్పుడు మాఱుపలుకవీవు
పురుషునీగికి సల్పమునకు సంతోషింతు
మొగమెత్తనేరవు మగనియెదురఁ
గీ. జెఱఁగుమాసిన మూన్నాళ్ల సిగ్గుతోడఁ
బతివిలోకసమార్గంబు పరిహరించి
సవితృఁడుదయింప నాల్నాళ్ళజలకమాడి
చూడవెవ్వారి బురుషుని జూచికాని. 48

మ. పసపుం గుంకుమ కజ్జలంబునును గూర్పాసంబు తాం
[బూలముల్
గుసుమంబుల్ కబరీభరంబు చెవియాకుల్ మంగళాలంకృతుల్
విసువొక్కింతయు లేక తాల్పవలయున్ వీనిన్ సదాకాలము
న్నసిచక్కంగ బ్రియుండువర్ధిలుటకై నాళీకపత్రాక్షికిన్. 49

గీ. రజకితోడనుదాసితో శ్రవణితోడ
విధవతో నాధుతోరాయు వెలదితోడ
జెడిపెతో జాలబోరామి సేయదనదు
ప్రాణసంకటములను బుణ్యాంగనలకు. 50

సీ. పతిపిల్వబంచిన పనియేమిఁకునివచ్చి
చెప్పిన యుడిగంబు సేయపలయు
భర్తయానతిలేక ప్రకృతిబంధునకైన
నేపదార్థంబును నీగిపెట్ట
జీవితేశ్వరుఁడుడించిన యోగిరంబులు
గుల్ల సేయక భుక్తి గొనుటతగవు
సుఖసుప్తుఁడగునిజేశు బ్రబోధమొనరింపఁ
గా దనుష్ఠాన భంగములదప్ప

గీ. నొంటి నెచ్చోటికరుగుట యుక్తిగాదు
తనుపుగట్టక నీళ్ళాడఁదగవుగాదు
కడపమీఁదను మఱి సన్నికంటిమీఁద
జక్కిమీఁదను గూర్చుండ జాడగాదు. 51

క. నాగరికత్వము వాచా
ప్రాగల్భ్యముజూపఁజనదు పతిముందట సం
భోగక్రీడావిభవో
ద్యోగంబులఁజక్క సతికి నుత్పలనయనా. 52

క. ఇదిధర్మంబిది యీలువ
యిదివ్రతమిది సద్వివేక మిదియాచారం
బిది దేవపూజ యధిపతి
యుదితం బాలంబుసేయకుండుటపతికిన్. 53

క. కాంతుఁడు సంతోషించిన
సంతోషింపంగవలయు సతికతఁడాత్మన్
సంతాపించిన పట్టున
సంతాపింపంగవలయు జలజేక్షణకున్. 54

సీ. చీఁకటితప్పుచేసిన సరోరుహనేత్ర
గూబయై వసియించుఁ గోటరమున
వింతవావిఁగటాక్ష వీక్షణంబునఁజూచు
గిసలయోష్ఠి వహించు నిల్లకన్ను
మగఁడుదన్నొత్తిన మార్గోత్తునలివేణి
వ్యాఘ్రియై జనియించు వనములోనఁ
జిరితిండితినవారి మొఱగి యాహారించు
నతివసూకరజాతియందుఁబుట్టు

గీ. నధిపుఁగోపించి హుంకారమాచరించు
పడఁతి మూఁగవు సవతిసౌభాగ్యలక్ష్మిఁ
జూడఁజాలక మదిలోన నూయసేయు
భామ దుర్భగయగు నన్య భవములందు. 55

ఉ. దూరముపోయియెండబడి దూపిలివచ్చిన ప్రాణనాథునిన్
ద్వారకవాటగేహళులదాఁక నెదుర్కొని తీర్థమార్చి యా
హారము వెట్టిపీడ్యము సమర్పణచేసి విహారశయ్యపై
నూరువులొత్తిచిత్తమునకుబ్బొనరించుట ధర్మమింతికిన్. 56

గీ. తగవుపాటించి యల్పంబు దండ్రియిచ్చు
నల్పమల్పంబు భ్రాతయు నాత్మజుండు
ప్రార్థితంబైన ధనమునల్పముగనిచ్చు
ప్రాణనాథునిసరియె యేబంధువ్రజము. 57

గీ. ఔర్వశిఖికంటె శిఖికంటె సర్యుకంటె
బిసుగుకంటెను దీవ్రమై బిసుసుచూపు
నాత్మఁదప్పఁగఁదలఁచు దురాత్మకులకు
నహహ! పతిదేవతాప్రభావాతిశయము. 58

గీ. తండ్రివంశంబునందేను తరములకును
తల్లివంశంబునందేను తరములకును
ధవునివంశంబునందేను తరములకును
శాశ్వత స్వర్గసౌఖ్యమీఁజాలుసాధ్వి. 59

## శ్రీనాథకృత శృంగార నైషధము.

మ. గురువన్నన్ ధనమన్నఁబుణ్యమనినన్ గోత్రాప్రియంబన్న దే
వరయన్నన్ మనమన్నఁదుష్టియనినన్ వాత్సల్యమన్నన్ నిజే
శ్వరుఁడన్నన్ బరమోపకారమనినన్ సర్వంబునన్నందలో
దరినీకున్ నిషధాధినాథుఁడెసుమీతథ్యంబుగాఁజెప్పితిన్. 60

సీ. పాటించికొలువుము భవనదైవతముల
సవతులఁగొనియాడు సఖులవోలె
నారాధనము సేయు నత్తమామల నెప్డుఁ
బరిజనంబులమీఁదఁ గరుణగలుగు
మలుగకు కోపించినపుడు నాథునితోడ
మదిలోన నుబ్బకు మన్ననలకుఁ
దోడికోడండ్రతోఁ గూడిమాడి చరింపు
దాసీజనముఁబ్రోవు తల్లికరణి

గీ. బ్రాహ్మణులయందు గురులందు బంధులందు
భక్తి విశ్వాస సౌహార్దపరత నెరపు
భవ్యపతిదేవతాచార పరమపుణ్య
ధర్మమే మఱకుండుము మీతల్లికొన. 61

---

## భాస్కర రామాయణము.

### అనసూయ సీతకు పతివ్రతాధర్మములు చెప్పుట.

గీ. ఒక్కమిన్నసతోనున్న నొల్లకున్నఁ
గరము నెయ్యుఁడై యున్నను గాకయున్న
మగఁడు ప్రియతముఁడనియుండు మానవతికి
నెల్లలోక సుఖంబులు నెమరువచ్చు. 62

క. నడవడి యొప్పకయుండినఁ
గడునిర్ధనుఁడయిన పతియె గతియునువిను మె
క్కుడు బంధుండును బ్రియుఁడుం
బడఁతులకుం బరమగురుఁడుఁ బరదేవతయున్. 63

గీ. ఇంతి శీలదోషంబుల నిట్టిపతికి
సతినలెవ్వరు ప్రతికూలలయిచరింతు
రమ్మహాపాపవతులు దుర్యశమునొంది
కూలికాంతు రధోలోక ఘోరగతుల. 64

క. పతిపరిచర్యాపరిణత
గతిలోకము మేలుకీడు గనియుండు పతి
వ్రతలునినుఁబోని గుణవతు
లతులిత సుఖకీర్తు లెందునందుదురబలా. 65

ఉ. నాపుడుబత్నికింబతియ నమ్మినబంధుడు నిష్టదైవముం
గావివరించి మజ్జననిగౌరవమారగ మున్నుచెప్పె నా
కీవిధమత్తగారు కృపయేర్పడ నానతియిచ్చిరిప్పు మీ
చేవినిధన్యనైతి విలసిల్లెమనంబు మహాతపస్వినీ. 66

ఉ. సత్యములైనజన్మములు నూఱునువేలునుచేసినందవ
స్సత్యశమక్షమాది గుణసంపదతోడవనైకవాసులై
నిత్యసమాధియోగమున నిల్చిననేరికిఁబొందవచ్చునే
పత్యనుకూలలైన కులపాలికలందెడు పుణ్యలోకముల్. 67

చ. పతియెడ రెండులేక కులభామలు తారతఁ జెట్టిఁడైన స
న్మతిఁ జరియించుటొప్పనని నంగమనీయచరిత్రుడుం గృపా
న్వితుఁడు జితేంద్రియుండునతినిర్మలధర్మయుతుండు సూనృతో
ర్జితుఁడును రాముఁడీరఘువరేణ్యుని నేగతిగొల్చుటొప్పదే? 68

క. గుణవతి సావిత్రియు న
త్ప్రిణుతయరుంధతియు ధర్మపరిణత యారో
హిణియుఁగనుట పతిశుశ్రూ
షణమునఁ గదా సదాయశస్సౌఖ్యంబుల్. 69

---

మార్కండేయపురాణము.

—• అనసూయ కౌశికపత్నికి పతివ్రతామహిమ చెప్పుట. •—

క. పతిశుశ్రూషణమున నే
నతులఫలప్రాప్తి నభిమతఫలముల్
పతిశుశ్రూషాని యతిని
సతతము బడయంగవచ్చు సతులకు సాధ్వీ! 70

మ. వ్రతముల్మంత్రజపోపవాసములు తీర్థస్నానముల్యజ్ఞ దా
నతపఃకర్మములాచరించుచును నానాభంగులన్నిత్యము
న్వతియాయాసనహిష్ణుడై కడఁగి సంపాదించుపుణ్యంబులో
పతిశుశ్రూషలఁగైకొనున్సతియుఁ దాసాఁబాలుధర్మస్థితిన్.71

గీ. స్త్రీజనంబుల కుపవాసతీర్థదాన
దేవపూజావ్రతాదుల తెరువువలదు
పతిసమారాధనవ్రత పరతఁ జేసి
సుగతి వారికిఁ దంగేటిజున్నుసుమ్ము. 72

---

నందిమల్లయ్య ఘంటసింగయ్యకృత వరాహపురాణము.

సీ. అత్తమామలు సెప్పినట్లు చేయుము గాని
యెదిరి మాఱుత్తరమీకుమమ్మ
వలయు వేళలఁ బెద్దవారు పంపక యెంతి
పనికిఁ బోనిండ్లకు జనకుమమ్మ
సకలబంధులకుఁ బూసలలోనిదారంబు
వలె సరాగంబున మెలఁగుమమ్మ
తోడికోడండ్రను సంతులను బట్టినచోట
నుదరక తాలిమినుండుమమ్మ

గీ. మానసంబున ధర్మమే మఱకుమమ్మ
నుతికి నెక్కిన నీసరిసతులలోన
వాసిగనుమమ్మ కులశీలవర్తనములు
కొంచెపఱుపకుమమ్మ విచారించుమమ్మ! 73

క. కసరకుమీ కోపించిన
విసువకుమీ సేవచేయు వేళల నీగుల్
గొసరకుమీ నీపాళికి
బిసరుహముఖి! యేమగఁడయి బెనిమిటిసుమ్మీ. 74

## శకుంతలాపరిణయము.

### పిల్లలమఱ్ఱి పినవీరభద్ర కవికృతం.

సీ. జీవితేశ్వరుఁ బాసి చిరకాల వసతిగాఁ
బుట్టినింటనెయున్కి బుద్ధిగాదు
పొరుగిండ్ల నిరుగిండ్లఁ బొద్దువోకలనైనఁ
బలుమాఱునరుగుట పాటిగాదు
దాసీజనముతోడఁ దఱచుగాఁగూడి త్ర
స్తఃమాటలాడుట తగవుగాదు
తనకెంతయాప్తులైనను నన్యపురుష సం
సర్గంబుఁజేయుట జాడగాదు
గీ. జనకగృహములనైనను మనసువఱపి
కూరనారకుఁబంపుట గుణముకాదు
హాస్యకథలందు గీతివాద్యములయందుఁ
బ్రీతిసెరపుట మగనాలి రీతిగాదు. 75

సీ. జలకమాహారంబు శయనసౌఖ్యము భర్త
కంటెను మున్నుగాఁగాదుసేయ
విభుఁడారగించినవెనుక తద్భాజనం
బునఁజేయ సర్వాంబు భోజనంబు
ప్రియుఁడల్గి తనుజేరఁబిల్వకుండిన భూమి
నింపుతోమతిఁ బవ్వళించుటొరవు
వ్రతములు దేవతార్చనలు కాంతుఁడుసమ్మ
తింపకచేత యెంతేనికలుష

గీ. మత్ప్రియంబులుచేసిన నధిపుమీఁదఁ
జిన్నఁబోవక మది సంతసింపవలయు
మంచిదైనను పాపిష్ఠి మనసురాని
పనులుమానుట భద్రంబు వనితలకును. 76

శా. ఏభంగిన్ శుచిజౌదునో పతిమనం బేభంగి రంజింతునో
యేభంగిన్ గులకీర్తిదాఁగలుగునో యేభంగివర్తింతునో
యేభంగిన్ మతిరాక యుండగలదో యేనాత్ములందంచు నా
యాభంగిన్ మతియించుచుండఁదగుఁబుణ్యస్త్రీకినెక్కాలముల్ 77

సీ. జలమాడి మడుగువస్త్రముగట్టి కై చేసి
కొనికాని కవదుఁబోఁజనదు ప్రియుని
మునుపుమేల్కొనిభర్త మోముఁగన్గొనికాని
కాఁగాదు వీక్షింపఁగానితరులఁ
గడపమీఁదను సన్నికెలుమీఁద రోలుమీఁ
దనునికి విభునికిఁ దఱుఁగుయశము
తడికాళ్ళతో వీడు దలతోడఁ గర్ణప
త్రములతో నిద్రపుణ్యంబుదఱుఁగు

గీ. సందె తలయంటుకొనుట వస్త్రంబులేక
మజ్జనముచేఁత విడియాకు మట్టగించి
త్రాల్చుటయునిలుగేలను దలపుఁకుట
భర్తగలభామినులకశుభప్రదములు. 78

క. వ్రతములు నుపవాసంబులు
మతియుఁ బనిరర్థకములు మానవతులకున్
బ్రతివాసరంబు సేవల
పతిభక్తియచాలు నిహము పరముఘటింపన్. 79

చ. తెలివకువల్లభుండు పరదేశమువోయినవన్నె మాని తా
నటితికి నల్లబూసలును నచ్చుతబొట్టును మట్టె వన్నెగా
గులుమణుగై నపుట్టమును గూడఁగదువ్వని మైలకొప్పునై
మఱువడియింటిలోనఁబతిసమాగమనంబమతింపుటొప్పగున్. 80

సీ. వనితకునిష్టదైవము జీవితేశుండు
భామకు ముంగొంగు పసిడిభర్త
సుదతికినటలేని చుట్టంబు పెనిమిటి
తరుణికిఁ బ్రాణమిత్రంబు ధవుఁడు
వనజలోచనకుఁ బెట్టనికోట దయితుండు
నాతికి నఖిలార్థదాత ప్రియుఁడు
కాంతకు మానరక్షకుఁడింటియాలంపు
సతికి నాఁడిలేని హితుఁడు వరుఁడు

గీ. కంబుకంఠికి నిత్యశృంగారవిభవ
వల్లికకునాలవాలంబు వల్లభుండు
వల్లవోష్ఠికి సౌభాగ్యభోగ్యలక్ష్మి
గణనయొనరింపనేల యెడ్డదయుమగఁడు. 81

సీ. అత్తమామలకు నీయపనేమిపెట్టుచుఁ
గనుసన్నఁ జేయుమీ పనులెఱింగి
ప్రాణమిత్రములుగా భావించియేప్రొద్దు
సవరింపుమీ ప్రేమ సవతులందు
భర్తయొక్కొకవేళ బహుమానమొనరింపఁ
గదియరానీకుమీ గర్వరేఖ
పతిచిత్తమెఱింగి తత్పరిజనంబులమీఁదఁ
జేయుమీ మిగుల దాక్షిణ్యగరిమ

గీ. కలకనొందకు మీధవుఁడలిగినపుడు
పలుకులనుజేర నీకుమా పరుసదనము
వీనివెలిగాఁగఁ దిరుఁగునే వెలఁదియైనఁ
గులమునకు నాధియగుఁజుమీ కూఁతుఁగుఱ్ఱ. 82

---

శ్రీకృష్ణజన్మఖండము.

బ్రహ్మవైవర్తము.

గోపీనాథప్రణీతము.

చ. అతివకువల్లభుండె గతియంచిత దైవము స్వర్గమోక్షముల్
వ్రతముగురుండుబంధుఁడుజపంబుతపంబుమఖంబుసర్వమున్
బతికిసమానమైన ప్రియబాంధవుఁ డన్యుఁడు లేడు గావునన్
బతినెడబాసియున్నయెడ భామకునించుక శోభగల్గునే. 83

గీ. దేవ! సాధ్వికి వల్లభుసేవ సర్వ
ధర్మములలోన నుత్తమధర్మమండ్రు
సంతతంబును బతిసేవసలుపనట్టి
సతికి సర్వంబు మిగుల నిష్ఫలముగాదె. 84

చ. వ్రతబహుతీర్థసేవ సజపద్విజభోజన భూప్రదక్షిణ
శ్రుతిపఠనాగ్నిహోమమఖ షోడశదాన సురప్రపూజనా
ద్యతులమహాతపోమహిమలన్నియు వల్లభుసేవసేయు స
య్యతివకుఁగల్గుసత్ఫలమునందుశతాంశముబోలదెన్నఁగన్. 85

క. కాంతునికన్నను బ్రాణము
కాంతునికన్నను బ్రియుండు గణుతింపంగాఁ
గాంతునికన్నను బంధుఁడు
కాంతామణికుర్విలేడు కంజాతభవా. 86

క. వ్రతమును దపమును జపమును
జతురత దానంబు తీర్థసంసేవనమం
చితసత్యము సురపూజయు
బతిసేవయె సతికి ధాత్రిపరికింపంగన్. 87

క. పతిసర్వవేదమయుఁడును
పతిసర్వసుపర్వమయుఁడుఁ బతిపుణ్యమయుం
డతివలకు నెందుఁజూచిన
బతినారాయణుఁడు పరమార్థమిలన్. 88

క. వల్లభునిచరణతీర్థం
బుల్లమురంజిల్లఁగాఁదు దుచ్ఛిష్టంబు
న్నెల్లనభుజించు భామిని
నల్లనదర్శింపఁగోరు నమరగణంబుల్. 89

క. పతిపాదభజనమిహాపర
వితత సుఖప్రదము పుణ్యవృద్ధికరమగుఁన్
బతిపాదసేవసేయని
పతివ్రతలజీవనంబు వ్యర్థముధాత్రిన్. 90

క. పతిసహితమైన యువతికిఁ
జతురతదొరకొను సమస్త సౌభాగ్యంబుల్
పతివిచ్ఛేదముఁకన్నను
సతికిన్మరణంబుమేలు సరసిజనేత్రా. 91

చ. వ్రతముతపంబునిర్జరసపర్యయు సర్వముమాని యత్నతన్
బతిచరణాబ్జసేవనముఁ బ్రస్తుతియున్బరితోషణంబు సం
తతమొనరింపఁగావలయు నాథునియానతిలేక యన్యదే
వతలభజింపఁగాఁదగదు వల్లవశేఖర! సాధ్వికెప్పుడున్. 92

చ. సురుచిరపీఠిపై నునుచి సొంపుగఫాలమునందుఁ జందనం
బరుదుగదిద్దిదేహమున నంచితభంగినలందిమాల్యమున్
గుఱుతుగకంఠమందునిడి గోర్కెసుధోపమ భోగవస్తువుల్
కరమరుదారగానొసఁగి కాంతునిపూజయొనర్పఁగాఁదగున్. 93

## గోపీనాథరామాయణము.

చ. అతివలకిందునందభిమతార్థకరుండు విభుండు తన్మనో
గతినతియు క్తిచేగనియ కల్మషభ క్తిసదామనంబులో
నతడెగురుండు దైవమఖిలార్థదుఁడంచు దలంచుచుఁ సము
న్నతమతిగొల్చియుండుట సనాతనధర్మములాడువారికిఁ. 94

క. జనకుడు జననియు సఖియును
దనయుండును దనకుగారు తథ్యము ధరలో
వినుము సతికిందునందును
ఘనుఁడగుపతియొకడె పరమగతి దలపోయఁ. 95

ఆ. వినుడు తంత్రిలేని వీణమ్రోయ దురథాం
గములులేని రథము గదలలేదు
సుతులు నూర్వురున్న బతిభ క్తిలేని తొ
య్యలిసుఖింపఁజాల దవనియందు. 96

క. ధనవంతుడైనను ని
ర్ధనుఁడైనను శీలవృ త్తిరహితుండైనఁ
ఘనకామవృత్తుడైనఁ
వనితకుగతిపతియెసుమ్మి వారిజనేత్రా. 97

గీ. సతికిఁ బతికంటె వేఱొకగతియులేదు
పతికి సతికంటె నొండొకఫలములేదు
తరుణి! యిరువురుపుష్పంబుతావుకరణి
నింపుసాంసార నేకీభవింపవలయు. 98

## రాజశేఖరచరిత్రము.

### మాదయగారి మల్లన్న కవికృతం.

క. మూసినముత్యమ్మవై క్రను
వాసియు వన్నెయునుగలిగి వరుఁడౌననఁగా
నీసకలబంధుకోటికిఁ
బూసలలోదారమగుచుఁ బొసఁగ మెలఁగుమీ. 99

క. నీవేమియుఁ బతివేఁడకు
దావేడుకవిభుఁడొసంగఁ దగదనకునిముఁ
రావింపఁదడవు సేయకు
రావింపమినటకుఁజేర రాకులతాంగీ. 100

క. మగఁడెవ్వరిఁ దెగఁజూచుఁ
మగఁడెవ్వరిఁబ్రోచునట్టి మాఢ్కినసతికిఁ
దగునడవ దేవుఁడనఁగా
మగఁడనఁగా వేఱుగలదె మదగజగమనా. 101

### బమ్మెరపోతరాజకృతభాగవతం.

సీ. నిలయమువాటించి నిర్మలదేహియై
శృంగారమేపార్చఁ జేయవలయు
సత్యప్రియాలాపచతురయై ప్రాణేశు
చిత్తంబు ప్రేమ రంజింపవలయు

దాక్షిణ్యసంతోష ధర్మమేధాదుల
దైవతమనిప్రియుఁ దలఁపవలయు
నాథుఁడేపద్ధతి నడచునాపద్ధతి
నడచి సద్బంధుల నడపవలయు
ఆ. మార్దవమునఁ బతికి మజ్జన భోజన
శయన పానరతులు జరపవలయు
విభుఁడు పతితుఁడైన వెలఁది పాతివ్రత్య
మహిమఁ బుణ్యుఁ జేసి మనుపవలయు. 102
క. ఉపవాసంబులు వ్రతములు
దపములు వేయేల? భర్తదైవతమని ని
ష్కపటతఁగొల్చిన సాధ్వికి
నృపవర! దుర్లభము లేదు నిఖిలజగములన్. 103
క. తరుణిదనప్రాణవల్లభు
హరిభావముగా భజించి యతఁడునుదానున్
సిరికైవడివర్తించును
హరిలోకమునందు సంతతానందమునన్. 104

ముక్కుతిమ్మనకృత పారిజాతాపహరణము.

క. పతిప్రాణసదృశ బంధువు
పతిదైవంబేసుగడయుఁ బతిసతులకు న
ప్పతియకడు మేరదప్పిన
గతి కులకాంతలకు వేఱుగలదే చెపుమా. 105

ఓంగళి సూరనామాత్యకృత కళాపూర్ణోదయము.

సీ. మఱచితప్పియు నన్యమహిమ విమర్శింప
జూడవీవన్యుని సొబగువేడ్కఁ
బతిభక్తిమొందుఁగీడ్పడ నీవువేఁడుదు
తత్ప్రీతియే దైవతంబుగనిన
నధిపుఁడుహర్షింప హర్షింతు చింతింపఁ
జింతింతు చిక్కినఁ జిక్కుదెపుడు
గడుఁజనవిచ్చినన్ గర్వింపనీక యుం
డిన భేదమొందవు డెందమునను
ఆ. నింతుఁగడవరీతి నుండు దెపుడును గం
భీరతకుఁ గలంగిచేరనీక
పతిప్రవాసవేళఁ బాటించికొనవు ని
మ్మైన గరగరికలు మెఱుఁగుఁబోఁడి. 106

చ. వరునకునెద్దియింపది సువర్తనగాఁగఁ దదప్రియంబ స
చ్చరితముగాఁగనెన్నదుని సర్గమునాకిదిమానరాద యీ
శ్వరుఁడునువేదమున్ గురుఁడుసర్వముభర్తయయేఁదదాజ్ఞను
స్థిరమతిఁజేయుచున్ విధినిషేధములెవ్వియుఁగైకొనందుదిన్ 107

ఆ. అత్తమామలన్న నాచార్యుఁడన్న స
ద్ధర్మమన్న నిష్టదైవమన్న
నీకుఁ బతియెసుమ్ము నెయ్యంపుఁగూతుర
యిది మహోపదేశ మెఱిఁగికొనుము. 108

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# టిప్పణి.

1. ఉనికి=ఉండుట, తద్దు=అత్యంతము, ఏడుగడ=రక్షకుఁడు (తల్లి, తండ్రి, పతి, దాత, విద్య, గురువు, దైవము) సప్తవిధములైన దిక్కులు అనగా రక్షకులు.

2. ఎలనాగ=యౌవనముగల ఆఁడుది, తూలు=చలించు, సంభ్రమము=వేగిరపాటు, ఉత్సాహము, పాద్యము=పాదముకొఱకైన జలము, మజ్జనము=స్నానము, ఒనర్చు=చేయు, రుచిరము=రుచిగల, చెచ్చెర=శీఘ్రముగ.

3. ధర్మువు=వేదోక్తవిధి.

4. మగువ=స్త్రీ, బేలతనంబు=మూఢత్వము, పొలియు=చెడును, పొలఁతుక=ఆఁడుది, మన్కి=వసించుట, అహి=పాము, పొత్తు=స్నేహము.

5. చందము=విధము, మూక=మూఁక, మొగి=ముందుగా, దురితము=పాపము, ఇంతి=స్త్రీ.

6. అనువర్తిని=అనుసరించునది.

7. అలుగు=కోపముచేయు, మదము=గర్వము, ప్రమాదము=ఏమఱుపాటు, అమరుఁడు=వేలుపు, సంప్రయోగము=చక్కగానమవుట, పనుపు=పంపు.

8. నియతము=నియమముగలది, రిత్త=ఊరక, శోధనము=శుద్ధిచేయుట, ఇమ్ముగ=యుక్తముగ.

9. కలహము=జగడము, ఎలయు=ప్రవేశించు, పెలుచన=గట్టిగా.

10. దీప్తము=ప్రకాశమానమయినది, ప్రతతి=సమూహము, ఆగమము=వచ్చుట, కాంక్షించు=కోరు.

11. మాడ్కి=విధము, జీవిక=బ్రతుకుతెరువు, విప్రుఁడు=బ్రాహ్మణుఁడు, అతిథి=ధర్మార్థము ఇంటికివచ్చిన యాచకుఁడు, ఉత్తమము—శ్రేష్ఠము, తాలిమి=క్షమ; ఓర్పు.

12. ఆఁచికొను=అపహరించుకొను, చపలాక్షి=చంచలముఁగల కన్నులుగలది అనగా స్త్రీ, ఊర్జితము=దృఢము, సుశీలము=మంచిస్వభావము, అన్వితము=కూడుకొనినది.

13. కలభాషిణి=మధురముగా మాట్లాడునది, విశ్రుతము=మిక్కిలి ప్రసిద్ధికెక్కినది, తెఱఁగు=విధము, అరయు=విచారించు.

14. కరము=అత్యంతము; మిక్కిలి, సంతతము=ఎల్లప్పుడు, శుభము=మంగళము, ఒదవు=కలుగు.

15. సమ్యగ్భావము=మంచిభావము, వెరవు—ఉపాయము, మరగు=ఆశపడు.

16. చెన్ను=అందము, అభ్యంతరము=ఇంటిలోని భాగము, కరణము=పనిముట్టు.

17. తివురు=కోరు, కువలయము=కలువ, నెపము=కారణము; తప్పు, విసము=ద్వేషము.

18. అనుంగులు=ఇష్టులు, సత్కృతము=సన్మానము, ఉత్థితము=లేచినది, తదీయ=తత్సంబంధమైనది.

19. దూష్యము=నిందింప దగినది, దుష్కరము=చేయఁగూడనిది.

20. చెలిమి=స్నేహము, దుర్విలసితము=చెడునడవడిక, తరుణి=యౌవనముగలయాఁడుది.

21. ఒడయఁడు=మగడు; స్వామి, మాతులుఁడు=మేనమామ, మహిత=యోగ్యమైనది.

22. చవి=రుచి, కైసేయు=అలంకరించు, ఎలమి=ప్రేమ; సంతోషము.

23. తలఁపించు=భావించు, పోరితము=కలహము, తగవు=తగినది.

24. సవతాలు=సవతి, అనురూపము=తగినది.

25. నికాయము=ప్రోగు.

26. ఆత్మజుఁడు=కొమారుఁడు, కొంగు=వెనుదీయు, చెట్ట=కీడు, ప్రమద=యౌవనస్త్రీ.

27. ఒప్పనివాఁడు=చెడ్డనడతగలవాఁడు, పాటించు=ఆదరించు; ప్రవర్తించు.

28. ఒప్పిదము=అలంకారము.

29. పరాయణము=ప్రాపు, అఖిలము=సమస్తము.

30. ఆసురి=రాక్షసి, తత్పరత్వము=దేనియందేనియాసక్తి, క్రౌర్యము=క్రూరభావము, పొలియించు=చంపు, ఈర్ష్య=ఓర్వలేనితనము, క్రోధన=కోపముగలది, సౌక్ష్మ్యము=సూక్ష్మత్వము.

31. ఎఱుక = తెలివి.

32. నితంబిని = గొప్పపిఱుదులుగల ఆడుది.

33. అపత్యము = సంతానము.

36. జలరుహము = తామర, రాజీవము = తామర.

37. అభ్యంగనము = తలంటు, ఉచ్ఛిష్టము = తినఁగా మిగిలినది.

38. మందెమేలము = అధికప్రసంగము, ముదలవెట్టు = ఆజ్ఞాపించు, కులట = అంకుటాలు, మానిని = మానముగలఆఁడుది

39. ప్రతిభ = కాంతి.

40. తలయంపి = తలగడ, ఎడలించు = తొలఁగించు.

42. భూజము = వృక్షము, సితపద్మము = తెల్లతామర, నిదానము = ఆదికారణము, పసిఁడి = బంగారు; ధనము, అంబుజాస్య = కమలమువంటి ముఖముగలది.

43. కినుక = కోపము, నిరంతరము = ఎల్లప్పుడు.

44. సారిది = వరుస; క్రమము, అరితి = ప్రేమ.

45. రాజసము = గర్వము, ఈక్షణము = కన్ను; చూపు

46. ధవుఁడు = పెనిమిటి, గరిమ = గొప్పతనము.

47. తరళము = చలించునది, కావరము = క్రొవ్వు; మదము, ధిక్కరించు = తిరస్కరించు, కల్మషము = పాపము, ధాత్రీవరుఁడు = రాజు.

48. ప్రోషితుఁడు = దేశాంతరగతుఁడు, ఈగి = ఈవి; ఇచ్చుట, సవిత = సూర్యుఁడు.

49. కజ్జలము=కాటుక, కూర్పాసము=రవికె, కబరి=కొప్పు, సని=ఆరోగ్యము, నాళీకము=తామర.

50. రజకి=చాకలది, ఉదక్య=రజస్వల, శ్రమణ=సన్యాసి, ఘేడిప=ఖంకటాలు, పోరామి=స్నేహము.

51. ఉడిగము=పరిచర్య, ఓగిరము=అన్నము, కుత్స=నింద, ప్రబోధము=మేలుకోలు, అనుష్ఠానము=ఆచారము; నడవడి, తడువు=చిన్నవస్త్రము, సన్నెకల్లు=నూరికొనుతాయి, జక్కి=తిరుగలి.

52. పాగల్భ్యము=పౌఢిమ.

53. ఈలువు=పాతివ్రత్యము; మానము, అలము=ఉపేక్ష.

54. సంతాపించు=మిక్కిలితపించు.

55. కోటరము=చెట్టుతొఱ్ఱ, మొఱగు=వంచించు, సూకరము=పంది, దుర్భగ=ద్వేషింపఁదగినది, భవము=పుట్టుక.

56. దూపిలు=పరితపించు; దప్పిగొను.

58. ఔర్వశిఖి=బడబాగ్ని, అరుఁడు=సూర్యుఁడు.

60. గోత్రోదయము=కులముయొక్క అభివృద్ధి, దేవర=వేలుపు, తుష్టి=తనివి; సంతోషము, వాత్సల్యము=ప్రేమ, తలోదరి=(తల+ఉదరి) పలుచని కడుపుగలది అనగా సన్ననినడుముగలది, తథ్యంబు=నిజము.

61. భవనదైవతము=ఇలువేల్పు, పాటించి=శ్రద్ధతో, కూడిమాడి=కలసిమెలసి, భక్తివిశ్వాస సౌహార్దపరత, బ్రాహ్మణులందుభక్తి=(పూజింపదగినవారనిభావము) గురులందు

విశ్వాసము=అనగా వారిమాటయందు నమ్మకము, బంధులందు సౌహార్దము=అనగా చెలిమి ప్రధానముగా గలిగియుండుట, నెరపు=నిర్వహింపుము, భవ్య=మంగళమైన, ఆచారము=నడత, పరమ=శ్రేష్ఠమయిన, పుణ్యా=సుకృతమైన, ధర్మము=వ్రతము, తల్లికాన=నాతల్లి (ప్రేమావేశముచే తల్లియనుట) కాన=తెనుగుసంబోధంబున అనుప్రయుక్తమగుశబ్దము.

62. మన్నన=ప్రియము; విశ్వాసము, నెయ్యుఁడు=స్నేహితుఁడు.

66. ధన్యా=పుణ్యవతి, విలసిల్లు=ప్రకాశించు.

67. నుత్యము=స్తోత్రము చేయఁదగినది, శమము=శాంతి, కులపాలిక=కులసతి.

68. కమనీయము=మనోహరము, సూనృతోర్జితుఁడు=దృఢసత్యముగలవాఁడు, వరేణ్యుఁడు=ముఖ్యుఁడు.

69. సత్ప్రణుత=మిక్కిలిపొగడఁబడినది, పరిణతము=పరిపాకముఁబొందినది.

71. భంగి=విధము.

72. తెరువు=మార్గము, సమారాధనము=పూజ.

73. ఉదరు=చలించు, వర్తనము=నడవడి.

74 బిసరుహము=పద్మము.

75. పాటి=న్యాయము, త్రస్తరి=పరిహాసము, సంసర్గము=చేరిక, మగనాలు=పతిపత్ని.

76. భద్రము=శుభకరము.

78. మట్టగించు=తగ్గించు.

79. ఘటిల్లు=కలుగు.

80. తెఱవ=ఆఁడుది, అఱుత=కంఠమందు.

81. ఆఱడి=నింద; అపవాదము, కంబుకంఠి=శంఖమువంటి మెడగలది, వల్లిక=తీఁగ, ఆలవాలము=పాదు, పల్లవోష్ఠి=చిగురులవంటి పెదవిగలది.

82. పరుసదనము=కఠినము, కూఁతుఁగుఱ్ఱ=చిన్నకూతుర (పేరిమచే చెప్పునది).

83. అంచితము=పూజింపఁబడినది, మఖంబు=యజ్ఞము.

84. నిష్ఫలము=వ్యర్థము.

86. కంజాతభవుఁడు=బ్రహ్మ.

87. సురపూజ=దేవపూజ,పరికింపగా=విచారించగా

88. సుపర్వుఁడు=వేలుపు.

89. చరణము=పాదము, రంజిల్లు=అనురాగము పొందు, భామిని=ఆఁడుది.

90. వితతము=విరివి చేయఁబడినది, సుఖప్రదము=సుఖమిచ్చునది.

91. దొరకొను=లభించు, విచ్ఛేదము=ఎడఁబాటు.

92. నిర్జరసపర్య=దేవపూజ.

93. సురుచిర=ఒప్పిదమైన, కరము=అత్యంతము.

94. అతివ=స్త్రీ, అభిమతార్థకరుండు=సమ్మతమైన కోరికల నెరవేర్చువాఁడు, అఖిలార్థదుఁడు=సమస్తమునిచ్చువాఁడు, సనాతనధర్మము=శాశ్వతమైనధర్మము.

95. పరమగతి=ఉత్కృష్టమైన ఆధారము, తలపోయగా=ఆలోచించగా.

97. శీలవృత్తరహితుండు=మంచినడవడిలేనివాఁడు.

98. తావి=పరిమళము, కరణి=వలె, ఏకీభవించు=ఒక్కటియగు.

99. వాసి=ప్రసిద్ధి, వన్నె=అందము; కాంతి

100. తడవు=ఆలస్యము, లతాంగీ=లేఁతతీఁగవంటి అఁమది.

101. మదగజగమనా=ఏనుఁగువంటి నడకగలదానా.

102. నిలయము=ఇల్లు, మార్దవము=మృదుత్వము, పతితుఁడు=పడినవాఁడు; పదవిచెడినవాఁడు, మనుచు=బ్రతికించు.

103. నిఖిలము=సర్వము, కొలుచు=సేవించు.

106. మహిమ=ఐశ్వర్యము, సొబగు=సౌందర్యము, కీడ్పడు=తక్కువపడు, డెందము=హృదయము, గరగరిక=అందము, మెఱుఁగుఁబోఁడి=మెఱుపువలెమనోజ్ఞురాలగు అఁడుది.

107. నిసర్గము=స్వభావము, విధినిషేధము=శాస్త్రసమ్మతముకానిది.

108. నెయ్యము=ప్రేమ.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



# TESTIMONIALS.



NUZVID,
20-3-31.

I have known Sreemathi Chebrolu. Saraswathi Devi garu for the last seven years as a Governess well versed in teaching English. She is a self made woman of remarkable perseverence and has a great capacity for hard work. Her interests are many sided but her field of specialisation lies in Telugu, Sanskrit and handicrafts. She is one of the very few Sanscrit scholars in the Andhra Desa and is a Poetess in Telugu too. I find that she takes a live interest in these languages and her Pathivratha Sathakamulu is a very valuable collection of well known poets of our ancient land, which speaks so much of her interest in serving the cause of the fair sex. The book contains an exhaustive collection of gems from various authors, quite worthy to be in the hands of each and every girl and woman of our country and I hope she will have many opportunities to write several such books useful to our women folk. Sreemathi Saraswathi Devi garu, is a diligent young woman of excellent character. I wish her the best success in life.

(Sd) **SRI RAJAH VENKATA RAMAYYA APPARAO BAHADUR GARU M. L. C.**

*Zamindar Mirzapuram Estate*

*&*

*President, District Board, Kistna,*

20—3—31.

శ్రీమత్పరదేవతాయైనమః.

# యోగ్యతా పత్రములు.

---

ప్రస్తుతము కొల్లాపుర నివాసినియు, సంస్కృతాంధ్ర విద్యావిశారదయునైన శ్రీమతి సరస్వతీదేవిగారు రచియించిన ఖండకావ్యమొకటి నేనెంతో సంతోషముతోఁ జదివించుకొని వింటిని. ఆంధ్రకవిత్వరచన మీమె కొలఁదికాలముక్రిందటనే యారంభించినను నింత స్వల్పకాలములో నింత మనోహరము గాఁ గవనముజెప్పుట మిక్కిలి శ్లాఘాపాత్రము. ప్రశంసనీయ మగు సంస్కృతసాహిత్యము కలుగుటచే, నీమె యచిరకాల మున నాంధ్రకవిత్వరచనమున మిక్కిలి ప్రౌఢకాఁగలదని నాకు గట్టి నమ్మికగలదు. ఈకవిత్వశైలినిబట్టిచూడ సహజ కవిత్వ ధోరణి యీమెయందు గర్భితమై యున్నదని చదువువారికిఁ దేటపడకపోదు. ఈయువతికిఁ బరమేశ్వరుఁడాయురారోగ్యము లిచ్చి యాంధ్రసారస్వతమునకు నలంకారాయమానములగు గ్రంథముల నీమెచే రచియింపఁజేయుఁగాక యని కోరుచు న్నాను.

రాజమహేంద్రవరము,
29—3—1929.

చిలకమర్తి లక్ష్మీనృసింహం.

# తప్పొప్పుల పట్టిక.

---

| పుట. | పద్యము. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 12 | 40 | చెవ్రలు | చెలువు |
| 13 | 42 | పతిజయ | బతిదయ |
| 16 | 50 | శ్రవణ | శ్రమణ |
| 16 | 51 | సేయుపలయు | సేయువలయు |
| 23 | 75 | వోకలన్నైనఁ | వోకలక్షైనఁ |
| 24 | 77 | శుచిజాదు | శుచినాదు |
| 25 | 81 | వల్లవోష్ఠికి | పల్లవోష్ఠికి |
| 29 | 97 | వంతుడై | వంతుండై |
| 34 | - | బ్రతుఃకులెరువు | బ్రతుకుతెరువు |
| 36 | - | పితపద్మము | పితపద్మము |

